## గంటలపంచాంగం

పార్థివ సం॥ నిజచైత్ర బ॥ ఏకాదశి

1945 సం॥ మే 8 మంగళవారం

మం॥ ఏకా ప 1-2 పూ॥భా ఉ 8-13 ఉ॥భా తె 6-34 వర్జ్యం సా 5-9 ము 6-39 క.

బ॥ ద్వాదశి మే 9 బుధవారం

బు॥ ద్వా ప 10-32 శే వర్జ్యం తె 4-42 వ సా 5-36 ము 7-5 క.


# ఆంధ్రపత్రిక

పార్థివ సం॥ నిజచైత్ర బ॥ ఏకాదశి మంగళవారము


## దేశీయ వైద్యం

కీర్తిశేషులు పానగల్లు రాజాగారి పట్టుదలవల్ల భారతదేశంలో ఇదివర కెక్కడా లేని దేశీయ వైద్యశాల ప్రప్రథమం 1924 లో మద్రాసులో స్థాపించబడింది. ఈ 20 సంవత్సరాలలోపలనూ సుమారొక వెయ్యిమంది విద్యార్థులు డిప్లొమాలుపొంది దేశీయ వైద్యవిధానాన్ని అవలంబిస్తున్నారు. ప్రభుత్వంవారు కూడా ఏటేటా ఈ పాఠశాలపైన కొంత ద్రవ్యం వెచ్చించుతూనే వున్నారు. 1924 లో రు 30,000 లు ఖర్చుచేయబడ్డది. 1944 లో ఆఖర్చు మూడు లక్షలకు పెరిగింది. కాని, ఈ యిరవైయేండ్లలోనూ దేశీయ వైద్యవిధానం పొందవలసినంత అభివృద్ధిని పొందలేదనటం నిర్వివాదం. దేశీయ వైద్యవిధానంపట్ల ప్రభుత్వంవారికిన్నీ, కొందరు ఆలోపతీ వైద్యులకున్నూ గల వైముఖ్యమే ఇందుకు ముఖ్యకారణం. పాఠశాలను స్థాపించినంత మాత్రాన ప్రభుత్వంవారి బాధ్యత తీరిపోలేదు. ఆ పాఠశాలను సర్వాంగ సంపన్నంగాజేసి, ప్రవీణులైనవారిని అధ్యాపకులుగా నియోగించి, నిపుణవంతంగా నిర్వహించబడేట్టు చూడటం ప్రభుత్వంవారి ముఖ్యకర్తవ్యం. ప్రభుత్వంవారింతవరకు ఈ కర్తవ్యాన్ని నిర్వర్తించినట్టు చెప్పలేము. పాఠశాల నిర్వహణ విషయంలో జరుగుతున్న లోపాలను గురించీ, వాటిని సవరించవలసిన అవసరాన్ని గురించీ ఏటేటా దేశీయ వైద్యమహాసభవారూ, ఇతర అభిమానులూ ఆందోళనచేస్తూనే వున్నారు. మొదటినుంచీ ప్రభుత్వం ఈ విషయంలో ఉపేక్షనూ, అవిశ్వాసాన్ని ప్రదర్శిస్తూ వచ్చిందేగాని మనఃపూర్వకంగా అభిమానంతోనూ, పట్టుదలతోనూ దేశీయ విధానాన్ని ప్రోత్సహించేందుకు పూనుకోలేదు.

ఇటీవల మదరాసులో జరిగిన 14 వ దేశీయవైద్య మహాసభను ప్రారంభిస్తూ ప్రభుత్వసలహాదారులు సర్ థామస్ ఆస్టినుగారు దేశీయ వైద్యపాఠశాలను గురించి ప్రకటించిన అభిప్రాయాలు దేశీయ వైద్యవిధానాభివృద్ధికి అపకారం చేయటానికి సమర్థమైనవే గాని, సాయపడేవి మాత్రం కావు. దేశీయవైద్య విధానానికీ, పాశ్చాత్య వైద్య పద్ధతికీ సమన్వయం కలుగజేసి, ఉభయపద్ధతులనూ విద్యార్థులకు గఱపటం ఈ పాఠశాల ముఖ్యోద్దేశాలలో ఒకటి అనిన్నీ, అట్టి సమన్వయం ఇంతవరకు సాధ్యం కాలేదనీ, దేశీయ వైద్యవిధానంలో పరిశోధన జరగనేలేదనీ, అందుచేత సరియైన పాఠ్య పుస్తకాలుగానీ, సమర్థులైన ఉపాధ్యాయులుగానీ లేరనీ సర్ ఆస్టినుగారు పాఠశాలలో వున్న లోపాలను ఏకరువుపెట్టినారు. లేని లోపాలను ప్రభుత్వసలహాదారులు కల్పించినారని మే మనటములేదు. దేశీయ వైద్యాభిమానులందరూ అప్పుడప్పుడీ లోపాలను సభలలోనూ, ఉపన్యాసాలలోనూ వెల్లడిస్తూనే వున్నారు. గత సంవత్సరం దేశీయ వైద్యపాఠశాల విద్యార్థులు సమ్మెకట్టినప్పుడు కూడా పాఠశాలలోని లోటుపాట్లను అనేకం ఉదాహరించి, వాటిని తొలగించవలసిందిగా ప్రభుత్వంవారికి విజ్ఞప్తి చేసుకొన్నారు. ఆ లోపాలను సర్దుబాటు చెయ్యవలసిన భారం ప్రభుత్వంవారిమీద వుండగా, వాటిని ఉపేక్షించి, ఇది అసాధ్యము, ఇది దుర్లభము, అది అసంభవము అని అక్షింతలు చల్లటము నేర్పరితనం కాదు. తగినంత ధనంవెచ్చించి ప్రవీణులైన ఆయుర్వేద వైద్యులను ఉపాధ్యాయులుగా ఆకర్షించేందుకుగాని, ఆస్పత్రి, ఫార్మసీ, లేబొరేటరీలలో తగిన సాధన సంపత్తిని ఏర్పరచేటందుకు గాని, పరిశోధన వర్గాలకు అవసరమైన వసతులు కల్పించటంలో గాని ప్రభుత్వంవారు దేశీయవైద్య పాఠశాలావసరాలను ఈనాటివరకు సవతితల్లి ప్రేమతోనే చూచినారు. ప్రభుత్వంవారి పరిపూర్ణాదరణను అనుభవించకుండా, ఈ పాఠశాల ఇంతకాలం జీవించివుండటమే గొప్పవిషయంగా చెప్పవచ్చు. అందుచేత, సర్. ఆస్టినుగారు పేర్కొన్న లోపాలు సవరించబడవలెనంటే ప్రభుత్వం వారందుకు తగినంతగా సాయపడాలి. అంతేగాని, ఊరక నెపము లెన్ని లాభంలేదు.

దేశీయ వైద్యంతోబాటు పాశ్చాత్య విధానాన్నికూడా బోధించవలెనా లేక, ఒక్క దేశీయవిధానాన్ని మాత్రమే బోధించడం ఉత్తమమా అనే విషయమై ప్రభుత్వంవారింతవరకు నిర్ణయానికి రాలేదనిన్నీ, భారత ప్రభుత్వం నియమించిన 'భోరు కమిటీ' వారి శిఫార్సులకోసం ఎదురుచూస్తున్నామనీ, చెప్పతూ, ఈ శిఫార్సులు వచ్చేవరకు దేశీయ వైద్యపాఠశాలయొక్క భావ్యభివృద్ధి అనిశ్చితమై వుండవలసిందేనని ఆస్టినుగారన్నారు. యుద్ధానంతరం ఆరోగ్యాభివృద్ధికై నియమించబడిన 'భోరు కమిటీ' వారు దేశమంతటా పర్యటించినప్పటికీ, దేశీయవైద్యవిధానానికి ప్రత్యేకసంస్థ అయిన మదరాసు దేశీయవైద్యపాఠశాలలో అడుగైనాపెట్టకుండా, దేశీయవైద్యంలో అనుభవజ్ఞుల సలహాలను సైతం పుచ్చుకొనకుండా తమ నివేదికను తయారుచేస్తున్నట్టు మహాసభాధ్యక్షులు డాక్టర్ సూర్యనారాయణరావుగారు వెల్లడించినారు. ఇట్టి కమిటీసూచనలవల్ల దేశీయ వైద్యానికి ఏమి ఉపకారం జరుగగలదో చెప్పలేము. ప్రజాప్రతినిధి ప్రభుత్వం ఏర్పడేవరకు ప్రస్తుత ప్రభుత్వంవారు దేశీయ వైద్య విధానంలో ప్రధానమైన మార్పులను తలపెట్టమని ప్రభుత్వ సలహాదారు లన్నారు. దేశీయ వైద్య విధానాభివృద్ధి విషయంలోనేగాక, తక్కిన యేవద్విషయాల్లోనూ అస్వాయుజముల ప్రభుత్వం వారీ సూత్రాన్ని పాలించినట్టు చెప్పగలరా?

## హిట్లర్ శవం
### దహన సంస్కారం పొందినదని మాస్కో ప్రకటన

మాస్కో, మే 4: బర్లిన్ శిథిలాలలో సోవియట్ సైనికులు హిట్లర్, గోబెల్సు శవాలను అయినా పట్టుకుందామని అన్వేషణ ప్రారంభించినవి. హిట్లరూ, గోబెల్సు మరణించిన తరువాత వారి శవాలను ప్రేలుడు సామాగ్రిలో వేసి నిప్పంటించారని ఒక కథ ప్రచారమైంది. హిట్లర్ శవమే దొరికితే పోల్చటం చాలా సులభం అని కారిస్ ట్రాక్టర్ పాల్ తెలిపినాడు.

హిట్లర్, గోబెల్సు, క్రెబ్సు ఆత్మహత్య చేసికొనినారనే గోబెల్సు అనుచరుడు హాన్సుఫ్రిట్జే తెలిపిన వార్తను బుజువు చేయటానికి ఇతర ఆధారాలు ఏమీ కన్పించటం లేదు. దీనికి తగ్గట్టుగా లండన్ డెయిలీ ఎక్స్ప్రెస్ పత్రికలో "హత్యానిందితులు కావాలి" అంటూ వీరితోబాటు మరి 4 గురి పేర్లను చెప్పి ప్రకటించింది. హిట్లర్, గోబెల్సు, గోరింగ్, హిమ్లర్, బోర్మన్ వే, రిబెన్ట్రాప్‌లు యూరోప్లలో జహాను బయలుదేరినారని సృవపవని వార్తను ఈ పత్రిక ప్రకటించింది.

### రష్యన్ వార్తలు

హిట్లర్ ఏమైనాడు అనే ప్రశ్నకు త్వరలోనే సమాధానం దొరకగలదని మాస్కో ప్రావ్దా పత్రిక ప్రకటించింది.

రీచ్ చాన్సలరీ ప్రాంగణంలో ఉన్నతనాజీ ఉద్యోగుల శవములు దొరికినట్లుగా రెడ్‌స్టార్ పత్రిక వెల్లడించింది.

డొనిట్జ్ సహకారి అడ్మిరల్ వాస్ సోవియట్ సైనికుల చేతుల్లో పడినాడని వార్త.

తూర్పు రంగంలో రెండేళ్లు సర్వసేనానిగా ఉన్న నాజీసేనాని ఫీల్డ్‌మార్షల్ ఫాన్ బాగ్ శవం మిత్రసేనలకు దొరికిందని అమెరికన్ విలేఖరి రేడియో ప్రకటన.

జర్మనీ అధీనంలో ఉన్న ప్రాగ్ రేడియో, గోబెల్సు, ఫీల్డ్‌మార్షల్ కీటెల్, మార్టిన్ బోర్మన్, నెర్నల్ కామన్, క్రెబ్సు ప్రతిఘటిస్తూ హిట్లర్ చాన్సలరీ ప్రాంగణంలో ప్రాణాలు వదిలినారని ప్రకటించింది.

ఈ ప్రకటన చాలా అనుమానాస్పదంగా ఉందని రాయిటర్ లండన్ విలేఖరి వ్రాస్తున్నాడు.

కీటల్ సంతకంతో నిన్నరాత్రే పశ్చిమోత్తర జర్మనీలో నాజీసేనల లొంగుబాటును గురించి వ్రకటనను ఫ్లెన్స్‌బర్గ్ రేడియో ప్రకటించింది. హిట్లర్ మరణించినాడన్న పుకారు బయలుదేరిన రోజునే జర్మన్లు హిట్లర్ చనిపోయాడని బ్రాడ్‌కాస్టు చేసినారు. అంతాఅయిన అయిదు రోజుల తరువాత జర్మన్లకు, అందులోనూ ప్రాగ్‌లో ఉన్న జర్మన్లకు అదనపు వర్తమానం ఎందుకువచ్చిందో తెలీదు!

### ఇతర నాయకులు

బ్రిటన్‌లో జినక రాయబారిగా ఉన్న వారన్ ఫాన్ న్యూరాత్, పూర్వం ఇటలీలో జర్మన్ రాయబారిగా ఉన్న జార్జ్ ఫాన్ మాకెన్ సన్ మొదటి ఫ్రెంచి సేనకు చిక్కినట్లు పారిస్ రేడియో ప్రకటించింది.

ఆస్ట్రియా మాజీ చాన్సలర్ డాక్టర్ షూస్నిగ్‌ను బ్రెనర్ సమీపంలోని కాన్‌సెన్ ట్రేషన్ క్యాంపులో ఉరితీసినట్లు తెలుస్తూవున్నది.

నార్వే 'నియంత' క్విస్లింగ్ తన అధికారి హిట్లర్ మార్గాన్ని అనుసరించి ఆత్మహత్య చేసుకోవచ్చునని తెలుస్తూవున్నదని ఆస్లోనుంచి అమెరికన్ అసోసియేటెడ్ ప్రెస్ విలేఖరి వ్రాస్తున్నాడు.

### మిత్ర ప్రముఖుల విడుదల

ఎడ్వర్డ్ డెలా డీయర్, పాల్ రేనా, (ఫ్రెంచి మాజీ ప్రధానులు) ఫ్రెంచిసేనాపతులు జనరల్ వామిలిన్, వేగాన్, జనరల్ కోమొరవిస్కీ (పోలిష్ సేనాని) వీరినందరినీ మిత్రసేనలు జర్మన్ చెరనుండి విడిపించినట్లు తెలుస్తూవున్నది.

## బర్లిన్‌లో సోవియట్ల పటుతర పాలనం

మాస్కో, మే 6: బర్లిన్ లో సోవియట్లు తమ పటుతర పాలనాన్ని అమలు చేశారని రాయిటర్ ప్రత్యేక విలేఖరి వ్రాశాడు.

సోవియట్ అధికారులు తమ కేమి విషయాలు విధించారో తెలుసుకొనేందుకుగాను జర్మన్ పౌరులు గోడలమీద అంటించబడిన పోస్టర్ల దగ్గర గుంపులు గుంపులుగా చేరుతున్నారు.

కార్మికులూ ఉద్యోగులూ, ఇంజనీర్లు వద్యన్న ఉత్తరువుల ప్రకారం పనిపాటులు జరపాలి. నగరం జనాభా కనుక్కోవడం, రేషన్ కార్డులను ఇవ్వడం, సప్లయిలను జాగ్రత్త చేయడం జరుగుతోంది. యుద్ధంవల్ల కలిగిన ఖిచాకులను తొలగించి బాగుచేస్తున్నారు.

## క్రిమియా ప్రకటన
### రష్యా వైఖరి

లండన్, మే 7: బ్రిటిషువార్తాపత్రికలు రష్యాలకున్నూ, బ్రిటను అమెరికాలకున్నూ ఉన్న సంబంధ బాంధవ్యాలను గురించి ఆశంకిస్తూ ఉన్నవి.

"క్రిమియా ప్రకటనను సామాన్యము కాదు, అని స్టాలిన్ మాలటావ్‌లు అభిప్రాయపడినారు అనిన్నీ భవిష్యత్తులో వారిపలుకుబడిలో ఉన్న దేశాలలో స్వతంత్రముగా ప్రవర్తించదలచుకొన్నారు" అని వ్రాయవలసివచ్చినట్టుగా మాంఛెస్టర్ గార్డియన్ పత్రిక ప్రకటించింది. పోలిషు సంప్రదింపులు భగ్నము అయిపోయినందుకుకూడా విచారపడుతూ ఈడెన్-స్టెటినస్ ఏమిచేయగలరో తెలుసుకోవడము కష్టము అనిన్నీ, భగ్నము అయిపోయింది ఒక్క పోలిషు వ్యవహారములోనే కాదు అనిన్నీ క్రిమియా ప్రకటనను యావత్తు భగ్నము అయిపోయింది అనిన్నీ జర్మనీ ఆస్ట్రియారాజ్య నిర్వహణములో రష్యా, బ్రిటన్, అమెరికాల పై నిరిపరీక్ష అవుతుందనిన్నీ మాంఛెస్టరు గార్డియన్ పత్రిక వ్రాసింది. ఆ పత్రికే ఇంకా యిట్లా వ్రాసింది.

"ప్రస్తుతము ఏదో లోపము ఉంది. ఎప్పుడూ ఏదో తప్పులు పట్టుకొని కూర్చుంటే లాభములేదు: బ్రిటిషువారున్నూ యునైటెడ్ స్టేట్సువారున్నూ రష్యాతో తమకు ఉన్న ఉత్తమ బాంధవ్యాన్ని పాటించవలెను. రష్యాకు ఏమికావలెనో రష్యా దేనికి సందేహపడుతున్నదో తెలుసుకోడానికి ప్రయత్నము చేయవలెను. మనము రష్యాతో కలిసిమెలసిజీవించవలెను, పనిచేయవలెను. మైత్రితో వారిని నమ్మకముగా సహాయము చేస్తూ ఉండవలెను.

ఈ విషయములో లండన్ టయిమ్సు పత్రిక ఈ విధముగా వ్యాఖ్యచేసింది.

పదహారుమంది పోలులను రష్యా అరెస్టు చేయడముతో పెద్దఅలజడి కలిగింది. ఈ సందర్భములో బ్రిటిషు అమెరికన్ ప్రభుత్వాలవారి విచారాలను తెలియజేసి వారి అభిప్రాయాలను తెలుసుకొని రష్యా ప్రవర్తించవలెను. ఈ విధముగా చేయనందువల్ల రష్యా నిష్కాపట్యమును గురించి అత్యాశ్చర్యము కలుగుతూ ఉంది. అత్యంత ప్రాముఖ్యవిషయాలు అతిసన్నిహితముగా ఎంతో నిష్కపటముగా నిర్ణయించవలసిన ఈ తరుణములో ఈమాదిరి చర్యలు నిరుత్సాహము కలుగజేస్తున్నవి.

రష్యా అన్నిటికన్నా పడమటిదిక్కును గురించి యెక్కువగా ఆలోచించినది. పోలిషు సమస్య ఒక్కటే కాకపోయినప్పటికిన్నీ రష్యాకు అది అత్యవసరమైన విషయము. ఇటువంటి సందర్భాలలో ఎంత నిష్కపటముగా చర్చిస్తే అంత మంచిది. అభిప్రాయభేదాలు అంటూ లేకుండా పోవాలి. దూరదృష్టి-సహనము-అత్యంత నిశ్చలచిత్తము అందరూ పాటించవలసిందే."

డెయిలీ మెయిలు పత్రిక ఈవిధముగా వ్రాసింది.

"రష్యా ఇరుగు పొరుగువారితోనూ, మిత్రరాజ్యాలవారితోనూ నిగూఢముగానూ బాధాకరముగానూ ప్రవర్తిస్తూ ఉంది. పదహారుమంది పోలులను అరెస్టు చేయడము యెట్లా నిర్ణయానికి విరుద్ధమని లోకము అనేట్లయితే రష్యా తనకు తాను నిందించుకోవలసి ఉంటుంది."

లిబరల్ న్యూస్ క్రానికల్ ఈ విధముగా వ్రాసింది.

'ఇటువంటి విషయాలు పరిష్కారము కావడానికి ఒకరినొకరు బాగా యెరిగి ఉండవలెను. రష్యా యూరపులో ఆక్రమించుకొన్న ప్రాంతాలలో పత్రిక విలేఖరులు స్వేచ్ఛగా సంచరించే అవకాశాలు ఉంటే సంగతి సందర్భాలు తెలియడానికి వీలు అవుతుంది.

### లండన్‌ప్రభుత్వ ప్రకటన

లండన్, మే 6: లండనులో వున్న పోలిషు ప్రభుత్వమువారు ఈ విధముగా ప్రకటించినారు:

రష్యనులు అరెస్టుచేసిన పోలిషు నాయకులు సోవియెట్ సైనికబలానికి విద్రోహము కలగజేసినారనడము "కేవలకల్పనం"

లండన్‌లో ఉన్న పోలిషు ప్రభుత్వమువారు ఇంకా ఈ విధముగా ప్రకటించినారు.

అరెస్టు అయిన పోలిషు నాయకులు సోవియట్ జనరల్ ఇవనవ్ తో మాట్లాడడానికి సోవియట్ కలనల్ పిమెనవ్ పిలవనంపించి వచ్చునప్పుడు వారి ప్రాణాలకు ఏవిధమయిన భయమున్నూ లేదని అధికారిగా గ్యారంటి ఇచ్చినాడు.

ఇందుకుతోడు పిమెనవ్ తనకంటే పయిఅధికారిని సంప్రదించిన తరువాత పోలిషునాయకులు లండన్‌లో ఉన్న పోలిషుప్రభుత్వమువారినీ పోలిషురాజకీయవేత్తలనూ సంప్రదించడానికి ఒక విమానమును యిచ్చిపంపుతానని ప్రమాణముగా వాగ్దానము చేసినాడుకూడాను.

జర్మన్ ఆక్రమణ సాగుతున్న రోజులలో ఈ పోలిషు నాయకులు రహస్యోద్యమాన్ని సాగించి రహస్యముగా రాజ్య నిర్వహణముచేసి జర్మనులతో పోలులను పోరాడించినారు. లండన్ లో ఉన్న పోలిషు ప్రభుత్వమును ఎప్పటి కప్పుడు సంప్రదిస్తూ ఉండేవారు. వారి ఆజ్ఞలను ఆమలు పెడుతూ పోలు ప్రజల నమ్మకానికి సరి అయినారు.

సోవియట్ కాదంటున్నప్పటికిన్నీ పోలిషు రాజకీయ సాంఘిక నాయకులను అరెస్టుచేయడమున్నూ అప్పడప్పుడు కాల్చివేయడమున్నూ జరుగుతూనే ఉన్నవి. అనేక సంవత్సరాలనుంచి రైతుపక్ష నాయకుడుగా పనిచేసినవారిలో ముఖ్యుడున్నూ పోలిషు మంత్రివర్గములో వాడున్నూ అయిన లాడిస్లావ్ కిరనిక్ అనే ఆయన్ను ఇటీవల అరెస్టుచేసినారు.

మాస్కో రేడియో ఇరవై సంవత్సరాల సోవియట్-పోలిషు సమాఖ్యను వార్సా పట్టణములో అంగీకరించినట్లు ప్రకటించింది.

## ఐకమత్యము స్వతంత్ర హేతువు కాదు
### డాక్టరు ఖరే అభిప్రాయము

పూనా, మే 5: సర్ ఫిరోజ్‌ఖాన్ నూన్ హాస్ ఫ్రాన్సిస్కోలో ప్రాంసంగిస్తూ హిందువులు ముస్లీములు ఏకము కావడముతో భారతదేశము స్వతంత్రదేశము అవుతుందని చేసిన ప్రకటనతో ఏకీభవించలేకపోతున్నట్లు హిందూమహాసభ డిపార్టుమెంటు సభ్యుడు డాక్టర్ ఎన్. బి. ఖరేగారు ఈ విధముగా చెప్పినారు. "హిందూ దేశము స్వాతంత్ర్యకాంక్షలో నాకన్నా మరొకడు ఎక్కువవాడు కాదు. హిందూ ముసల్మానులు ఏకము అయిన క్షణాన స్వాతంత్ర్యము వస్తుందని నేను నమ్మను. హిందూ దేశం స్వతంత్రము కావడానికి కావలసింది ఒక్క ఐకమత్యమే కాదు. జర్మనీలో కావలసినంత ఐకమత్యము ఉంది. కాని చెలరేగవలసివచ్చింది. ఏ ఒక దేశమయినా మరొక దేశముమీదికి బయలుదేరినప్పుడు దానిని అరికట్టడానికి ప్రపంచానికి అంతటికీ సంబంధించిన ఒకసంస్థ ఉండవలెను.

### ఆర్యవైశ్యసభలు

మైసూరు సంస్థాన ఆర్యవైశ్య మహాసభలు హాసన్ జిల్లా హొళే నరసీపురంలో మే 12, 13 తేదీలలో జరుగును. శ్రీ చుండూరు వెంకటరెడ్డిగారు 6 వ యువజన మహాసభ ప్రారంభంచేస్తారు. యం. రామస్వామిశెట్టిగారు అధ్యక్షత వహిస్తారు.

### పోలిష్ నాయకులు

1 వ పేజీ తరువాయి

ట్లుగా తనకు తెలుసనీ స్టెటినియస్ చెప్పాడు. పోలండునుగురించి సమాధానం వినవేచియున్నాము; అంతేకాక అంతర్జాతీయ ధరావులను గురించీ, కొత్త ప్రణాళిక ప్రకారంచేసే ప్రాంతీయ ధరావుల నమూనా వాదాలను గురించిన్నీ పునరాలోచన చేసేవిషయమై రష్యావైఖరి ఎలా ఉండేదిన్నీ తెలిసికో వేచియున్నాము, అందువలన భద్రతసభ యావత్తున్నూ స్తంభించి ఉందని స్టెటినియస్ చెప్పాడు. ప్రాంతీయ ధరావులను, అంతర్జాతీయ ధర్మపాలనలను పునర్విచారించే విషయములను గురించిన్ని అగ్రరాజ్యాలు అయిదింటి మధ్యను ప్రతిష్టంభన ఇదివరకే పూరాగా ఏర్పడిఉందని ఇపుడు తెలుస్తున్నది. తలవని తలంపుగా ఏమున్నా జరిగితేతప్ప సభా సమితుల్లోను, విచారణాది సంఘాల్లోను ఈతగాలు లలె తిక్కతప్పవు. అగ్రరాజ్యాలకు పరస్పర నిరాకరణలతో సరిపోతుంది. ఈ పైన తెల్పిన విషయాలలో బ్రిటన్ అమెరికాలకు కలిసిందికాని రష్యాతో కలవలేదు.

### వ్యవహారంచెడింది!

అయితే ధర్మపాలనా వ్యవహారంలో బ్రిటన్ అమెరికాలకు చెడనే చెడింది. సంధిపత్ర పునర్విచారణలోకూడా పోలిష్ ప్రశ్న వచ్చింది. అంతర్జాతీయ కార్మిక సంస్థను లోకశాసనంలో చేర్చవలసిందని బ్రిటిషువారు పట్టుబడుతున్నారు. ఆయా విషయాలను గురించిన్ని స్వల్పభేదాలు లేక పోలేదు. రష్యా అమెరికా లిందుకు ప్రతికూలంగా ఉన్నవి. మహాసభలో ఇదిన్నీ తగాదావిషయం కావచ్చును.

పోలిషు నాయకులను రష్యన్ మిలిటరీవారు నిర్బంధించటం చాలా తీవ్రమైన సంగతని బ్రిటిషు విదేశాంగమంత్రి ఈడెన్ అన్నాడు.

పోలిషుప్రశ్న తిన్నంగా తేలేవరకు ఈ విషయమై మొలటావ్‌తో ఇక చర్చలు జరగవని ఈడెన్ తెలుపుతున్నట్టుగా అమెరికన్ వార్త

సంస్థలవారికే ప్రత్యేకంపెలిచి బ్రిటిషు అధికారులు తెలిపారు. ఈడెన్ తెలిపిరేతం బ్రిటిష్ ప్రభుత్వానికి తెలిపి ఇంతలో ఈ చర్చ జరగబోదని మొలటోవ్‌తో చెప్పాడు.

రష్యనులు నిర్బంధించి విచారించనున్న పోలిష్ నాయకులు 5 వేర్వేరు పార్టీలకు చెందినవారు.

ఓకెలో జనరల్ అదలిక్షిన ఉన్నట్లు ఇక్కడ తెలుస్తున్నది. జాంకొవ్‌స్కీని మరి 10 మందిని పోలిష్ ప్రభుత్వంలో చేర్చుకోవలెనని యాల్టాలో ఆలోచించినాపట.

## స్త్రీల స్థాయి మారకతప్పదు
### 7 వ కృష్ణాజిల్లా మహిళాసభలో వివేచన

"బెంగాలు బీహారు మొదలయిన రాష్ట్రాలలో మొండలు తల్లులూ పిల్లలూ పిల్లలు వెల్లిపోతున్నారు. ఆహారపదార్థాలు అతిశీఘ్రంగా యం. పి. పంబాబుంగాష్ట్ర ప్లాంటుగా ఆహారపదార్థాలు అందుకే అంరపోవడంచేత ప్రజలు ఎంతో చదవిస్తున్నారు. ఈ బాధలను నివారించుకోడానికి ఆ ప్రాంతాలలోని స్త్రీలందరూ రాజకీయ పల కుల భేదాలు లేకుండా కలిసి కృషిచేస్తున్నారు. ఇలాగే భారతదేశ మంతటా ఈమహాసభచే అల్లుల్లాపోతున్న తమ అక్కచెల్లెండ్ల నుపనిపాకలను సంరక్షించుకోవాలి ఐక్యకృషి కొనసాగించు కోవలసిఉంది." అంటూ అఖిలభారత మహిళాసభ స్థాయి సంఘ సభ్యురాలు హజ్రా బేగం గారు, ఏప్రిల్ 29,30 లలో కాటూరులో జరిగిన కృష్ణాజిల్లా 7 వ మహిళాసభను ప్రారంభిస్తూ చెప్పారు. మన స్వాతంత్ర్య సముపార్జనకై మనం సన్నద్ధంకావాలి అనీ, దేశంలో సగభాగంగా ఉన్న స్త్రీలు భారత స్వాతంత్ర్య సంపాదనకై దీక్షవహించకపోతే దానికి ముక్తిలేదు. అనీ ఆమె అన్నారు. ఆహ్వానసంఘాధ్యక్షురాలు శ్రీమతి మన్నే పున్నమ్మగారు స్వాగతం ఇచ్చారు. శ్రీమతులు సరోజినీ నాయుడు, సాంఘ రాజ మెహతా, కల్యాణ సుబ్బలక్ష్మి; కల్పకా దత్తు, పెద్దాడ కామేశ్వరమ్మ, ప్రేమలతాగుప్తా మొదలయినవారు పంపిన సందేశాలు చదివారు. శ్రీమతి మెల్లి పోలింగర్ గారు 'భారతదేశంలో సగభాగంగా ఉన్న స్త్రీలందరూ స్త్రీల అభ్యుదయానికై ఈ పతాకంకింద ఐక్యంగా కృషిచేయాలి అని పతాకం ఎగరేస్తూచెప్పారు. సభకు అధ్యక్షత వహించిన డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబగారు ఉపన్యసిస్తూ, ప్రసూతి, శిశుపోషణ, ఆరోగ్యం, స్త్రీవిద్య మొదలయిన సమస్యల విషయంలో మహిళాసంఘం సాగించిన కృషిని కొనియాడారు. హిందూ న్యాయశాస్త్రం సవరణలో బి. ఎన్. రావు కమిటీవారు ముందు అడుగువేసినందుకు అభినందించారు. స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యం కల్పించవలెనంటే కన్నబిడ్డలకు అందరికీ స్త్రీ పురుష వివక్షణ లేకుండా తల్లిదండ్రుల ఆస్తిలో సమాన హక్కు ఉండాలనీ, సమిష్టిసంసారవ్యవస్థను అనుసరించి వారసత్వపు హక్కుకూడా ఏర్పాటు చేయాలనీ, వివాహం, విడాకులు మొదలయిన విషయాల్లో అభివృద్ధికరమైన పద్ధతులు నవలంబించాలని అన్నారు. చట్టాన్ని అమల్లో పెట్టటంలో సగం ప్రభుత్వాన్నికోరారు. దేశాభివృద్ధికి సమాజాభివృద్ధికి జాతీయవికాసానికి తీరని నష్టం కలిగించే ప్రచారాన్ని తీవ్రంగా ఎదుర్కోవాలి అని తెలిపారు.

భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొంటున్న స్త్రీలనూ, స్త్రీ ఉద్యమాన్ని నిందించడం భారత స్వాతంత్ర్యోద్యమానికే తీరనినష్టం. అలాంటి ప్రచారాన్ని ఖండించాలి. స్త్రీల హక్కులకు, సమస్యలను సాధించుటకై స్త్రీలు ముందుకు రావాలి. గ్రామోపాధ్యాయ స్త్రీ నిర్మాణ నిర్మించాలి. నయమైన మహిళా ఉద్యమాన్ని నిర్మించ ప్రతిఒక్కరూ పూనుకోవాలి అన్నారు. దేశాభివృద్ధి కొనసాగించే కార్యక్రమంతో పాటు కుటుంబ మంచి చెడ్డల విషయంలో కూడా యెక్కువ శ్రద్ధ చూపెట్టాలి సంసార నిర్వహణంలో నూ, కుటుంబ బాధ్యతలలోనూ, గృహనిర్వహణ శిక్షణలో ఇవి విషయాలలోనూ ఆదర్శ గృహిణులుగా ఉండాలి. అప్పుడే మహిళా ఉద్యమం పెంపొందుతుంది అన్నారు.

శిశు ప్రదర్శనం, ఆరోగ్యప్రదర్శనం, ఖాదిగాయాల ప్రదర్శనం, చేతుపనుల ప్రదర్శనం మొదలైనవి జరిగెను. 'కురుక్షేత్ర' బుర్రకథ, నాటకం; బతుకమ్మ, నృత్యం; గురజాడ అప్పారావుగారి 'దేశభక్తి' సమష్టిగానం మొదలైనవి ప్రదర్శింపబడినవి. ప్రధాన కార్యదర్శి శ్రీమతి అన్నపూర్ణాదేవిగారు ప్రతినిధులసభ వార్షిక నివేదికను చదువుతూ, 200 ల గ్రామాల్లో 8 వేల సభ్యులున్నారు, అన్నారు.

## మదరాసు విశ్వవిద్యాలయం

ఎస్. ఎ. 1 వ భాగం

నెంబరులు:—1 to 11 14 to 22 24 to 26 28 to 61 63 to 63 68 to 71 73 to 76 78 to 81 84 to 87 89 to 92 94 95 97 to 109 111 to 118 122 123 128 130.

2 వ భాగం

1 వ తరగతి: 137 141 143 144 147 149 150 152 153 154 155 159 160 165 167 168 170 172 176 178 182 187 188 190 192 194 to 197 200 202 to 204 206 207 211 212 215 216 219 220 239 మరియు 240.

2 వ తరగతి: 133 to 136 138 140 142 145 146 148 151 158 162 to 164 165 169 171 173 174 179 181 184 185 191 193 198 199 201 208 214 221 226 to 230 233 234 236 237 241 243 246 to 249.

నెంబరు 125 2 వ భాగంమాత్రం ఉత్తీర్ణుడయ్యెను.

బి. ఇ. డిగ్రీ (సివిలు 1 వ భాగం)

250 251 253 256 to 258 261 263 265 266 269 270 273 to 275 277 279 to 281 283 to 287 289 to 300 301 to 306 308 to 311 369 370 378.

మెకానికల్ 1 వ భాగం

314 to 317 319 320 322 324 325 327 328 330 334 335 337 to 340 342 344 345.

ఎలక్ట్రికలు 1 వ. భాగం

348 352 to 356 359 to 361 365.

సివిలు 2 వ భాగం

387* 389 390 392 393 397* 399* 401 407* 409 410* 411 412* 414 415 416* 417 418.

* గుర్తుగలవారు అనర్సుతో ఉత్తీర్ణులయిరి.

2 వ తరగతి:—369 373 384 to 385 388 391 394 396 to 400 402 to 403 408 418 419.

420 నెం. ఎ. గ్రూపులో ఉత్తీర్ణుడయ్యెను.

368 374 2వ భాగం మాత్రం ఉత్తీర్ణులయిరి.

మెకానికలు 2 వ భాగం.

1 వ తరగతి:—421 423* 427 429 431* 433* 437.

2 వ తరగతి:—422 425 428 430 432-434 to 436 438 439.

378 2 వ భాగం మాత్రం

ఎలక్ట్రిసిటీ 2 వ భాగం.

1 వ తరగతి 442* 443* 444* 445 447* 448* 449 450* 451* 452* 453* 454 456 457* 458* and 459:

2 వ తరగతి:—446 460 462.

ప్రాతినిబంధనలు

ఎస్. ఇ. ఎన్వరూ ఉత్తీర్ణులు కాలేదు.

బి. ఇ. డిగ్రీ (సివిలు)

471 472 476 478 481.

మెకానికలు

483 485 492 497.

ఎలక్ట్రికలు-ఎవరూ ఉత్తీర్ణులు కాలేదు.

3 వ తరగతి:—4 6 20 to 22 31 32 37 39 42 52 53 55 57.

బి. ఒ. ఎల్. (ఆనర్సు) 1 వ భాగం

ఇంగ్లీషు

ఉన్న ఒక్కడే ఉత్తీర్ణుడయ్యెను.

ఎ. ఎస్. సి. (కెమిస్ట్రీ) 1 వ భాగం

కెమిస్ట్రీ

4 6 8 16 18 16 19 to 21 24.

బి. టి. డిగ్రీ

1 వ తరగతి:—159.

2 వ తరగతి:—2 4 6 14 16 19 42 45 54 64 80 93 97 115 164 183 252 265 271 275 278 302.

3 వ తరగతి: 1 3 5 7 to 9 12 13 15 17 18 20 to 27 29 30 34 to 40 43 44 46 to 51 55 to 58 60 to 63 65 67 to 69 71 to 76 78 79 81 to 85 87 83 90 92 94 to 93 93 101 10- 104 to 103 108 109 114 116 118 120 121 123 to 125 128 133 136 145 to 149 153 to 155 157 158 161 to 163 165 to 167 169 171 to 173 175 to 182 184 185 188 189 191 193 195 196 199 203 204 206 to 210 212 to 241 233 to 244 246 to 248

250 251 253 254 256 to 262 264 to 270 272 to 274 276 277 280 to 291 293 to 301 303 304.

### ఎ. ఆర్. పి. పూర్తిగ రద్దు

మదరాసు, మే 7: ఎ. ఆర్. పి. సర్వీసులో అన్ని సెక్షనులు, మదరాసు విశాఖపట్నం కుండల సంచారపు సెక్షనులతో సహా జూను 1 వ తేదీనుండి రద్దుచేయుటకు ప్రభుత్వంవారు నిశ్చయించిరి.

## కాన్‌సెన్‌ట్రేషన్ కాంపుల చరిత్ర
### తెలుసుకోడానికి ఇండియాతో ప్రారంభించవలెనని బెవాన్ ప్రకటన

బర్కింగ్‌హామ్, మే 6: అనిన్ బెవాన్ అనేపార్లిమెంటు లేబరు సభ్యుడు ఉపన్యసిస్తూ "కాన్‌సెన్‌ట్రేషన్ కాంపుల చరిత్ర తెలుసుకోవలెనంటే జర్మనీతో ప్రారంభించకూడదు. ఇండియాతో ఆరంభించవలెను. ఆ కాంపులలో ఎక్కువమంది బాధపడ్డది జర్మనులు. దీనినిబట్టి లక్షలకొద్దీ యోధులు జర్మనీలో ఉన్నట్లు రుజువు అవుతూ ఉంది" అని చెప్పినాడు.

